## పాట 7.

రచన : ఆత్రేయ పాడినవారు : రామకృష్ణదాసు

సాకి : మానుమరల చిగురిస్తుంది
చేను మళ్ళీ మొలకేస్తుంది

పల్లవి : మనిషికిమాత్రం వసంతమన్నది
లేదని రాసిందెవరు ?
అది లేదని వెలివేసిందెవరు చెలీ ఓ చెలీ
వయసు సొగసూ వంతు వేసుకుని
మనసును కసిగా తరిమినవి
తోడులేని నీ దోరవయసులో
వేడివూడ్పులే ఎగసినవి
కన్నీళ్ళకు ఆరేనా నీలో తాపం
ఎన్నాళ్ళమ్మా ఎన్నేళ్ళమ్మా నీకీ శాపం?
అద్దంలో నీ పెదవే నిన్ను హేళనచేసింది
అందం నేనెందుకు నీకని నిలదీసడిగింది
పురుషుడు కట్టిన తాళి
అతనితో తీసెయ్యాలి
అతనికిముందే పెట్టిన పూలు
ఎందుకుమానాలి ఎందుకుమానాలి ? ? ॥మానుమరల॥

## పాట 8.

రచన : నారాయణరెడ్డి పాడినవారు : జానకి

ఎన్నాళ్ళు వేచేనురా – నీకై
ఎన్నాళ్ళు వేచేనురా–
నీవు రావాలని – నిన్ను చూడాలని
ఎన్ని దీపాల కొలిచేను–
నీకై ఎన్నాళ్ళు వేచేనురా–
ఏ చిరుగాలి సాగినా
ఏ చిగురాకు వూగినా
ఏ రామచిలుకా పలికినా
ఏ కలకోకిల పాడినా
నీ పలుకులని నీ పిలుపులని
ఉలికి ఉలికి తలవాకిట నిలచి ॥ఎన్నాళ్ళు॥
ఏ కనిలో దాగున్నావో
ఏ వలలో చిక్కుకున్నావో
ఏ తోడు లేదనుకున్నావో
ఎంతగా కుములుతున్నావో
నీ సౌఖ్యమే నా వరమని
తలచి తలచి నీ దారికాచి ॥ఇంక ఎన్నాళ్ళు॥

## తారాగణం:

శ్రీకృష్ణ. విశ్వనటచక్రవర్తి యస్. వి. రంగారావు. (ద్విపాత్రాభినయం) గుమ్మడి. పద్మనాభం. ప్రభాకరరెడ్డి. రాజనాల. మిక్కిలినేని. మాడా వెంకటేశ్వరరావు. ముక్కామల. కె. వి. చలం. విజయనిర్మల. సావిత్రి. మంజుల. శ్రీరంజని. నర్తకి మిస్. జెన్నీ

అతిథి నటులు:

కళావాచస్పతి జగ్గయ్య, అల్లు రామలింగయ్య. రమాప్రభ

పంపిణీదారులు: ఆంధ్ర: తారకరామా

నైజాం: శ్రీ తారకరామా

సీడెడ్: నవభారత్ ఫిలింస్

కర్ణాటక: మూవీలాండ్ మూవీస్

బెంగుళూరు

## సాంకేతిక నిపుణులు:

కథ: పాల్

రచన: భమిడిపాటి

పాటలు: డా॥ నారాయణరెడ్డి. శ్రీశ్రీ. దాశరథి. కొసరాజు. ఆత్రేయ.

ఛాయాగ్రహణం: అశోక్ కుమార్

నేపథ్యగాయకులు: సుశీల. జానకి. యల్. ఆర్. ఈశ్వరి. మాధవపెద్ది. యస్. పి. బాలసుబ్రహ్మణ్యం. వినోద్ కుమార్

స్టూడియో: ప్రసాద్

మా తదుపరి చిత్రం

అనిల్ ఆర్ట్స్

**"ప్రొడక్షన్ నెం 2"**

ప్రముఖ తారాగణంతో

నిర్మాత. దర్శకులు: తాతినేని ప్రకాశరావు